# గ్రంథముల ప్రకటన :—

—:*:—

జ్యోతిష విద్యామాధవీయం లేక ముహూర్తచంద్రిక-
గుణదోషములు, పరిహారములు చెప్పఁబడును రు 0-8-0
వాస్తుసంగ్రహం (తా-స) 0-6-0
వాస్తుదర్పణం, దీపిక- దేవాలయమునవిగ్రహములుంచువిధం 0-8-0
గృహ నవవర్గుదర్పణం- చిన్నసైజు 0-8-0
సంతానరత్నాకరం- భిన్నసంతానం, వాని గ్రహయోగములు 0-10-0
సీతారామ ప్రశ్నశాస్త్రం 0-4-0
సంతానవృద్ధి ప్రదీపిక 0-3-0
జినేంద్రమాలా- ప్రశ్నగ్రంథం 0-12-0
సస్యానందం- (తా-స) కాలమానస్థితిగతిఫలంగలది 0-6-0
మేఘమాలికాశాస్త్ర సంగ్రహం- వచనకావ్యం - బాలు
రకుకూడా బోధపడును 0-3-0
అర్ఘప్రదర్శిని- అత్యర్ఘ మొదలగు ఫలములుగలవు 0-8-0
జాతకదీపం- జన్మపత్రికవ్రాయు క్రమంకూడగలది (తా-స) 0-4-0
పాచకప్రశ్న- ప్రశ్నశాస్త్రం 0-4-0
భార్గవపంచాంగం- దివారాత్రులయొక్క శుభాశుభములు 0-3-0
గృహవాస్తు- సనతు [illegible] నది 0-3-0
కుక్కుటశాస్త్రం- [illegible] 0-8-0
జ్యోతిషచక్రప్రదర్శి[illegible]చనం 0-8-0
కపర్దిస్మృతి- కారిక[illegible] 1-8-0
నృసింహకారికలు 1-0-0
శింగాభట్టీయం- [illegible]ములు 0-12-0
విదశామంజరి 0-3-0
ఇవిగాక మావద్ద [illegible]

చల్లా ల[illegible] [illegible]పుత్రులు

సుబ్బరాయశాస్త్రి

బచ్చుపేట, మచిలీపట్టణము.

# శ్రావణ మంగళ గౌరీ వ్రతము.

—**—

ఆచమ్య... సంకల్ప్య... ఏవంగుణ... శుభతిథౌ॥ మమ [illegible] జ్జన సౌమంగల్య సిద్ధ్యర్థం। పుత్ర పౌత్ర సంపత్సౌభాగ్యసిద్ధ్యర్థం। మంగళగౌరీప్రసాదేన నిత్యానందసిద్ధ్యర్థంచ। మంగళగౌరీ ప్రీత్యర్థం వివాహ ప్రథమవర్షాది పంచవర్ష పర్యంతం మంగళగౌరీవ్రతంకరిష్యే॥ ఆదౌ గణాధిపతిపూజాం కుర్యాత్॥

శ్లో॥ ప్రథమేవత్సరే మాతుః గృహే కర్తవ్యమేవచ। తతో భర్తృగృహే కార్యా పూర్ణేషూద్యాపనంక్రమాత్॥

తా॥ మొదటి సంవత్సరం ఈవ్రతము పుట్టినింట చేయవలయును. పిమ్మట అత్తవారియింట జేయవలయును. ఐదుసంవత్సరము లిట్లుచేసినపిమ్మట యథావిధిగా ఉద్యాపనమును జేయవలయును.

ధ్యానమ్॥ శ్లో॥ నీలలోహిత తాటంక హారిద్రా కుంకుమాదిషు। తాంబూలపుష్పగంధేషు దర్పణేకచశోధకే॥ సింధూరే కజ్జలే వస్త్రే కంకణాదౌ ఫలాదిషు। జ్వాలామూర్ధ్నఘృతదీపస్య మంగళద్రవ్యభాజనే॥ శుభదాగ్న్యసుసంతోషే నిత్యలీలావిలాసినీం। సంపూర్ణచంద్రవదనాం సర్వజ్ఞాం శివసుందరీమ్॥ వరాభయకరాం భోజాం పాశాంకుశ కరోజ్జ్వలాం। సావిత్రీంసదయాం దేవీం సర్వమంగళ దేవతామ్॥ బాలాం సర్వార్థాంసంపూజ్యాం మంగళద్రవ్యవాసినీం। సర్వాలంకారసంపూర్ణాం భావయేత్సర్వమంగళామ్॥ ఐం, హ్రీం, శ్రీం నమస్సర్వమంగళాయై మంగళగౌర్యై నమః॥ ధ్యానమ్...మి॥ శ్లో॥ అత్రాగచ్ఛ మహాదేవి సర్వలోక సుఖప్రదే। యావద్వ్రతమహం కుర్వే పుత్రపౌత్రాభివృద్ధయే॥ హ్రీం నమస్సర్వమంగళాయై మంగళగౌర్యై నమః॥ ఆవాహనమ్॥ శ్లో॥ గాంగేయాసనందివ్యం రత్నమాణిక్యశోభితం। మయానీతంగృహాణత్వం గౌరీపూజాదివల్లభే॥ ఆసనమ్॥ శ్లో॥ గంధపుష్పా

శుద్ధైర్యుక్తం పాద్యం సంపాదితంమయా । త్వంగృహాణ దయాసింధు గౌరీమంగళదేవతే॥ అర్ఘ్యమ్॥ శ్లో॥ కామారివల్లభే దేవి కుర్వాచమనమంబికే । నిరంతరమహం వందే చరణౌ తవపార్వతి॥ ఆచమనమ్ ॥ శ్లో॥ పయోదధిఘృతంచైవ మధుశర్కరయా సమం । పంచామృతేన స్నపనం కారయేత్వాంశివప్రియే॥ పంచమృతస్నానమ్॥ శ్లో॥ జాహ్నవీతోయమానీతం శుభంకర్పూరసంయుతం । స్నాపయామి సురశ్రేష్ఠే త్వాంపుత్రాదిఫలప్రదామ్॥ స్నానమ్॥ శ్లో॥ వస్త్రంచసోమదైవత్యం లజ్జాయాస్తునివారణం। మయాసమర్పితంభక్త్యా గృహాణపరమేశ్వరి॥ వస్త్రమ్॥ శ్లో॥ కంచుకం తూపవస్త్రంచ నానారత్నైస్సమన్వితం । గృహాణత్వంమయాదత్తం జగదీశ్వరిపార్వతీ॥ కంచుకాది॥ శ్లో॥ కుంకుమాగరుకర్పూర కస్తూరీ చందనాదికం । విలేపనంమహాదేవి గంధం స్వీకురుశాంభవి ॥ గంధమ్॥ శ్లో॥ రంజితాకుంకుమౌఘేన హరిద్రాక్తాస్తథాఽక్షతాః। తవాలంకరణార్థాయ ప్రదత్తాస్సర్వమంగళే॥ అక్షతాన్॥ శ్లో॥ హరిద్రాం కుంకుమంచైవ సింధూరం కజ్జలాదికం । నీలలోహిత తాటంకే మంగళద్రవ్య మీశ్వరీ ॥ సౌభాగ్యద్రవ్యాణి ॥ శ్లో॥ కిరీటహార కేయూర కంకణాది విభూషణైః। అలంకరోమి త్వాం భక్త్యా సర్వాలంకారకారిణి ॥ ఆభరణాని ॥ శ్లో॥ అర్ధాంగవల్లభే దేవి శాంభవీత్రిపురాంతకే । స్వర్ణోత్తరీయం దాస్యామి గృహాణత్వం సర్వమంగళే॥ స్వర్ణోత్తరీయమ్॥ శ్లో॥ చంపకా కుంద మందార పున్నాగ బృహతీ యుతైః । పుష్పైర్బిల్వదళైశ్శ్వేతైః పూజయామి శివప్రియామ్ ॥ పుష్పాణి పూజయామి ॥

అథాంగపూజా ॥ ఉమాయైనమః। పాదౌపూజయామి॥ గౌర్యైనమః । జంఘేపూ...మి ॥ పార్వత్యైనమః । జానునీ...మి ॥ జగన్మాత్రేనమః । ఊరూ...మి॥ జగత్ప్రతిష్ఠాయైనమః । కటిం......మి॥ మూలప్రకృత్యైనమః । నాభిం...మి ॥ అంబికాయైనమః । ఉదరం...మి॥ అన్నపూర్ణాయైనమః । స్తనౌ...మి ॥ శివసుందర్యైనమః । వక్షః...మి ॥ మహాబలాయైనమః । బాహూన్...మి॥ వరప్రదాయైనమః । హస్తాన్...మి॥ కంబుకంఠ్యైనమః । కంఠం...మి॥

బ్రహ్మవిద్యాయై నమః । జిహ్వాం ... మి॥ శాంకర్యై నమః । ముఖం ... మి ॥ శివాయైనమః । నేత్రే ... మి ॥ రుద్రాణ్యైనమః । కర్ణే ... ... మి॥ సర్వమంగళాయైనమః । లలాటం ... మి ॥ సర్వేశ్వర్యై నమః। శిరః ... ... మి॥ మంగళగౌర్యైనమః। సర్వాణ్యంగానిపూజయామి॥ తతః అష్టోత్తరశతనామపూజాం కరిష్యే ॥

శ్లో॥ దేవదారురసోద్భూతః కృష్ణాగరుసమన్వితః । ఆఘ్రేయ స్సర్వదేవానాం ధూపోఽయం ప్రతిగృహ్యతామ్ ॥ ధూపమాఘ్రాపయామి॥ శ్లో॥ త్వంజ్యోతి స్సర్వదేవానాం తేజసాం తేజఉత్తమం । జ్యోతిర్మంగళగే దేవి దీపం స్వీకురు శాంకరి ॥ దీపం దర్శయామి ॥ శ్లో॥ అన్నంచతుర్విధంస్వాదు రసైష్షడ్భిస్సమన్వితం । గృహాణభక్ష్య భోజ్యాఢ్యం సుదృష్టం సర్వమంగళే ॥ నైవేద్యం సమర్పయామి ॥ శ్లో॥ పూగీఫలసమాయుక్తం నాగవల్లీదళాన్వితం । కర్పూరైలాసమాయుక్తం తాంబూలంశివసుందరి ॥ తాంబూలం ... మి॥ శ్లో॥ సౌవర్ణీ దక్షిణాహ్యేషా పూజా సాఫల్యకారణం । దక్షిణాం ప్రతిగృహ్ణీష్వ దక్షిణేసర్వమంగళే ॥ దక్షిణాం ... మి॥ శ్లో వాణీ లక్ష్మీ శచీ మాళీ నీరాజితపదాంబుజే । శివేనీరాజయామిత్వాం నిత్యలోకప్రకాశికామ్॥ నీరాజనం ... మి॥ శ్లో॥ పుష్పాంజలింప్రయచ్ఛామి భక్తిపూర్వంసమంత్రకం । తేనపాపానిసర్వాణిమ మంగళేతపసాదయో॥ పుష్పాంజలిం ... మి॥ శ్లో॥ శివాంకవాసినీమంబాం సర్వదేవానుపూజితాం। ప్రదక్షిణేనపశ్యంతి తేనకుర్యాంప్రదక్షిణమ్॥ ప్రదక్షిణాం ... మి॥ శ్లో॥ ఐం- నమశ్శివకాంతాయై హ్రీం- నమశ్శివశక్తయే । శ్రీం- నమోజగతాం మాత్రే మమభూయాన్మనోరథః॥ నమస్కారం ... మి ॥ శ్లో॥ పునరర్ఘ్యం ప్రదాస్యామి మంగళే శివసుందరి । సర్వపాపక్షయం కృత్వా రక్షమాంశరణాగతామ్॥ పునరర్ఘ్యం ... మి॥ శ్లో॥ ఇదంఫలంమయాదత్తం పుత్రపౌత్రాది వృద్ధయే । దేహిపూర్ణఫలం దేవి కృపాంకురు శివేమయి॥ ఇతి ఫలసమర్పణమ్॥ శ్లో॥ పుత్రాన్దేహి ధనం దేహి సౌభాగ్యసర్వమంగళే। సామంగల్యంసుఖంజ్ఞానం దేహిమేశివసుందరి। ఇతి సంప్రార్థ్య ॥ అథ వాయనదానమ్ ॥ బ్రాహ్మణం సంపూజ్య ॥

శ్లో॥ తతోన్యైణవపాత్రేషు మంగళద్రవ్యసంయుతం। సగుడంతండు లోపేతం నవకంచుకసంయుతమ్॥ తాంబూలాదిసమాయుక్తం చణ కాది సమన్వితం। సదక్షిణాకం దాస్యామి మంగళాంబా ప్రసీదతు॥ ఇతివిప్రాయ వాయనదానమ్॥ శ్లో॥ కాత్యాయనిశివాగౌరి సావిత్రీ సర్వమంగళా। సువాసినీభ్యోదాస్యామి వాయనానిప్రసీదతు॥ ఇతి సువాసినీభ్యో వాయన దానాని॥ అథ మాత్రే వాయన దానమ్॥ శ్లో॥ తామ్రేవా వైణవేపాత్రే సౌభాగ్యద్రవ్యమాక్షిపేత్। బహు కంచుకసంయుక్తం సహిరణ్యంసవస్త్రకం। మాత్రేదద్యాసువాసిన్యై జగన్మాతా ప్రసీదతు॥ తతఃపరంఘృతవర్తిభిః షోడశదీపావళింప్రజ్వాల్య కథాశ్రవణపూర్వకం కజ్జలంసంపాద్య॥ దేవీప్రసాదసిధూరం కుంకు మంవాధాలే సంపూర్ణంప్రసాద్య వేణీంసంగృహ్య తతఃపరం మాతృ బాంధవసువాసిన్యై షోడశసువాసనీం మాతరంచ మృష్టాన్నేన భోజ యేత్॥ తతః ఛత్రచామరాదినా పునఃపూజాంకుర్యాత్॥

## కథా ప్రారంభము.

యుధిష్టరఉవాచ॥ శ్లో॥ నందనందన గోవింద శ్రుతాలోకా బహుళాః కథాః। శ్రుతాఉత్కృష్టపుత్రాయుః కథంబ్రూహివ్రతంమమ॥

తా॥ నందుని కుమారుండవైన యోకృష్ణా! వినువారికి శ్రే యస్సునొసంగెడు కథ లనేకంబులుగలవు. వానిలో నెక్కువయిన పుత్రులను, ఆయువును, సంపత్తు మొదలగువానిని గలిగించు వ్రత మెద్దియో నాకుఁజెప్పుమని ధర్మరాజు కృష్ణమూర్తి నడిగెను.

శ్రీకృష్ణ ఉవాచ॥ శ్లో॥ అవైధవ్యకరంవక్ష్యే వ్రతంచారినిషూదన। శ్రుణుష్వసావధానస్సన్ కథాంపుణ్యాంపురాతనీమ్॥

తా॥ కృష్ణమూర్తి చెప్పుచున్నాఁడు. శత్రుసంహారకుఁడవైన యో ధర్మరాజా! స్త్రీలకు వైధవ్యము కలుగనియ్యని వ్రతమును జెప్పుచున్నాను. కావున పుణ్యకరమును ప్రాచీనంబయిన యొక్క ఇతిహాసమును స్థిరచిత్తుండవై వినుము.

శ్లో॥ కుండినంనామనగరం ఖ్యాతి స్వత్రద్విజప్రియః। ఆసీద్వణి గ్ధర్మపాలో నామ్నా బహుధనోపినః॥

తా॥ ప్రపంచమునందొక చోట కుండినమను పట్టణముకలదు. ఆపట్టణంబున బ్రాహ్మణులయందు ప్రేమకలవాఁడును, విశేషమైన ధనముగలవాఁడును నయిన ధర్మపాలుండనెడు వైశ్యుఁడుగలఁడు.

శ్లో॥ సపత్నీకోఽప్యపుత్రోఽసౌ నాస్తీతివ్యాకులోహృది। తస్య గేహే భస్మలిప్తో దేహే రుద్రాక్షధారకః॥ జటిలో భిక్షుకోనిత్య మాగచ్ఛత్ప్రియదర్శనః। నస్వీకుర్వం స్తదన్నం స ఇతిదృష్ట్వాఽబలావదత్॥

తా॥ ఆవైశ్యుఁడు భాగ్యగలవాఁడయినను సంతానము కలుగలేదు. అందువలన మనస్సున విచారముకలవాఁడయ్యెను. ఇట్టి సమయంబున దేహమునందు విభూతిని, రుద్రాక్షలను ధరియించినవాఁడును, జడలుకలవాఁడును, ప్రేమాస్పదమైన దృష్టికలవాఁడు నయిన యొకభిక్షుకుఁడు ఆవైశ్యుని గృహంబునకు ప్రతిదినము భిక్షకు వచ్చినవాఁడై యావైశ్యునిభార్యచేఁ బెట్టఁబడిన యన్నమును గ్రహింపక తిరిగి వెళ్లుచుండెను. ఆచిన్నది యీచర్యనంతయుఁ జూచి తన పెనిమిటితో నిట్లు చెప్పెను.

శ్లో॥ స్వామిన్నయంసదా యాతి భిక్షుర్నో జటిలోగృహే। నసీకరోత్యస్మదన్న మితిదృష్ట్వామయాఽధికమ్। దుఃఖంప్రజాయతేనిత్యం శ్రుత్వాభార్యావచోఽబ్రవీత్॥

తా॥ ఓ స్వామీ! జడలనుధరించిన యీయతీశ్వరుఁడు భిక్షకొఱకుఁ బ్రతిదినమును మనగృహమునకు వచ్చుచు నేనిచ్చెడి యన్నమును గ్రహింపఁడాయెను. దీనినిఁ జూచి నాకు విశేషముగా దుఃఖము కలుగుచున్నదని భార్య చెప్పఁగా ఆమాటలు విని పెనిమిటి పలుకుచున్నాఁడు.

ధర్మపాలఉవాచ॥ శ్లో॥ ప్రియే కదాచిత్త్వం సువర్ణాని శోభనే। యదాభిక్షార్థమాయాతి భిక్షుర్ద్వారాంతరేత్వయా। తదాతస్య ప్రదేయాని సువర్ణాని ప్రియేఽనఘే॥

తా॥ దోషరహితురాలవైన యోప్రియురాలా! నీవు సంతోషముతోఁ గూడినదానవై ఒకానొకప్పుడు బంగారు విక్రయించెడు అంగడికి వెళ్ళి అచ్చట నెప్పుడు భిక్షకొఱకు యతీశ్వరుఁడు వచ్చునో

అప్పుడాయన వస్త్రంబులో సున్నపురాల నుంచుమా యని ధర్మ పాలుడు చెప్పెను.

శ్లో॥ అనంతరంతస్య భార్యా౽చీకగ త్స్వామినోదితం। జటిలేనస్తు సాశప్తా ౽పత్యంతేనభవిష్యతి॥ శ్రుత్వా భిక్షోరిదంవాక్యం దుఃఖితా తమువాచహ ॥

తా॥ అనంతరం బ్రాహ్మణుని భార్య పెనిమిటిచెప్పినట్లు చేయఁగా యాచిన్నదానికి సంతానముకలుగదని జడదారి పలికెను. ఆయతీశ్వరునిమాటలను విని ఆమె దుఃఖించి ఆయనతో నిట్లుపలికెను.

శ్లో॥ స్వామిన్ శప్తా త్వయా పాపా చ్ఛాపా దుద్ధర సంప్రతి। ఇత్యుక్త్వాతస్యచరణౌ వవందే దీనభాషిణీ ॥

తా॥ ఓస్వామీ। పూర్వజన్మకృత పాపంబుచె నేను శపింపఁబడితిని. ఈ శాప విమోచనముఁ జేసి నన్నిప్పుడు రక్షింపు మని యా చిన్నది దీనముగా మాటలాడి యా యతీశ్వరుని పాదములకు నమస్కరించెను.

జటిలఉవాచ॥ శ్లో॥ భర్తృపమీపే వక్తవ్యం త్వయామాత్పురీం మమా జ్ఞయా। నీలవస్త్రంసమారుహ్య నీలశృంగచ్ఛకాననమ్ ॥ ఖగసం తత్రిక_గ్తవ్యం యత్ర౽శ్వ స్తేస్ఖలిష్యతి ॥

తా॥ జటిలుండు చెప్పుచున్నాఁడు :- ఓ చిన్నదానా। నా యాజ్ఞచే నీపెనిమిటితో నేఁజెప్పినగీతి నిట్లు చెప్పుము. నల్లనివస్త్ర ములఁగట్టుకొని నల్లనిగుఱ్ఱము నెక్కి యడవికి వెళ్ళి యెంతదూరము గుఱ్ఱము వెళ్ళి నడవలేక ఆయాసపడునో అంతవఱకు వెళ్ళి యచ్చట త్రవ్వవలయును.

శ్లో॥ రమ్యంపక్షిభిరాయుక్తం మృగసంగసమాకులం। సువర్ణ రచితంరత్న మాణిక్యాదివిభూషితమ్ ॥ నానాపుష్ప స్సమాయుక్తం దృశ్యందేవాలయంతతః। వర్తతేతత్రభవతీ భవాని భక్తవత్సలా। ఆరాధయత్వంమనసా యథావిధ్యుద్ధరిష్యతి ॥

తా॥ అనంతరం బచ్చట సుందరమయినదియు, పక్షులు వ్యా పించియున్నదియు, మృగసమూహములుగలదియు, బంగారుచేసినిర్మింపఁ

బడినదియు, రత్నములు మాణిక్యములు మొదలగువానిచేఁ గూర్చ బడినదియు, అనేక పుష్పంబులతో నిండియుండిన దేవాలయము కనుపించును. ఆ దేవాలయంబులోఁ బూజ్యురాలును, భక్తులయందు ప్రేమగలదియు నగు పార్వతీదేవి యుండును. ఆమెను నీమనస్సున యథావిధిగాఁ బూజించెదవేని నిన్ను రక్షింపగలదని చెప్పెను.

శ్లో॥ తాంభవానీతివచనం శ్రుత్వాభిక్షుస్సుఖప్రదం। వనం దేతస్యచరణౌ పునఃపునరువాచహ ॥

తా॥ పార్వతీదేవి శాపవిమోచనచేసి నిన్ననుగ్రహించును. అని యతీశ్వరుఁడు ప్రేమచే బల్కిన మాటలను విని యానందించి ఆయనపాదములకు మ్రొక్కి మాటిమాటికి శాప విమోచనమును గుఱించి యడుగుచుండెను.

శ్లో॥ సద్వైవకాలేజటిలః త్వంతర్ధ్యాతోబభూవసః। సావదత్ప్రతిమృత్యుహి శ్రుత్వా భిక్షుముఖాదరాత్ ॥ యథోక్తమవద ద్భర్తాతచ్ఛ్రుత్వా వాక్యమాదరాత్। నీలవస్త్రస్సమారుహ్య నీలాశ్వం ప్రస్థితోవనమ్ ॥

తా॥ యతీశ్వరుం డీప్రకారము చెప్పి యప్పుడే యంతర్ధానమయ్యెను. ఆచిన్నది పెనిమిటిని యిటురండని పిలిచి యతీశ్వరునిచేఁ జెప్పఁబడినవాక్యమును శ్రద్ధతోనుమని యథావిధిగా జెప్పఁగా నావైశ్యుఁడు శ్రద్ధతోవిని సంతసించి నల్లనివస్త్రములను ధరించి నల్లని గుఱ్ఱమునెక్కి వనమునకుఁ బ్రయాణమయ్యెను.

శ్లో॥ గచ్ఛన్ నానావిధాన్ వృక్షాన్ పథిపశ్యన్ మహాకులః। మృగాన్ సింహాన్ దంతశూకాన్ పథిపశ్యన్ భయాకులః॥ దదర్శాఽసౌతటాకంచ బాహుళ్యేన విరాజితం। రక్తనీలోత్పలైశ్చక్రవాకద్వంద్వైశ్చరాజితం। స్నానంచకార తత్రాఽసౌ తర్పణాద్యపి భూరిశః॥

తా॥ ఆవైశ్యుఁడు వనంబుఁబ్రవేశించి వెళ్లుచు మార్గంబున ననేక వృక్షములను, మృగములను, సింహములను, పాములను జూచి భయముగలవాఁడై వెళ్లుచు నెదుట ఎఱ్ఱగలువలు, నల్లగలువలు, చక్రవాకమిథునములు మొదలగువానిచే శోభిల్లుచున్న గొప్పచెఱువుంగని

యచ్చట. స్నానముచేసి సంధ్యావందనము, పితృతర్పణము మొదలగు నిత్యకర్మలను విశేషముగా నెఱవేర్చెను.

శ్లో॥ పునరశ్వంసమారుహ్య జగామగహనంవనం । స్ఖలితంనాజినం పశ్యన్ అశ్వాదుత్తీర్యసవచ । జఘూన పృథివీం తత్ర యానా ద్దేవాలయాంగతః ॥

తా॥ తిరిగి గుఱ్ఱము నెక్కి చొరరాని యడవిలోఁ గొంతదూరము వెళ్ళఁగా నచ్చట గుఱ్ఱము తొట్రుపాటుకలిగి నడవలేనిదయ్యెను. అంతట గుఱ్ఱముదిగి యచ్చట దేవాలయమగుపడునంతవఱకు భూమిని దవ్వెను.

శ్లో॥ దదర్శచమహాస్థూలం దేవాలయమధోతతః। రత్నైర్ముక్తా ఫలైశ్చైవ మాణిక్యైశ్చాపి సర్వతః । పూజయామాసజటిల వాక్యం స్మృత్వాఽతివిస్మితః ॥

తా॥ అనంతరము క్రిందిభాగమున రత్నములతోను, ముత్యములతోను, మాణిక్యములతోను, అంతట వ్యాపించియున్న గొప్ప దేవాలయమునుజూచి యతీశ్వరుఁడు చెప్పినరీతిగా నుండుటచే నాశ్చర్యముచెంది ముందుచెప్పెడు ప్రకారంబునఁ బూజించినవాఁడాయెను.

శ్లో॥ సువర్ణయుక్తవస్త్రాణి చందనంచాక్షతాఞ్ఛుభాన్ । చంపకాదీనిపుష్పాణి ధూపం దీపం విశేషతః ॥ నానాపక్వాన్నసంయుక్తం రసైష్షడ్భిస్సమన్వితం। నానాశాకైస్సమాకీర్ణం సదుగ్ధఘృతశర్కరమ్॥ నైవేద్యంకరశుద్ధ్యర్థం చందనంమలయాదిజం । సంపాద్యాశుస్ప్రహృదయః ఫలతాంబూలదక్షిణాః । జజాపమంత్రాన్గుప్తోఽసౌ సగుణధ్యానపూర్వకమ్ ॥

తా॥ బంగారుతోఁగూడిన వస్త్రములను, మంచిగంధమును, శోభస్కరమైన యక్షతలను, చంపకము మొదలైన పుష్పములను, ధూపమును దీపమునిచ్చి, షడ్రససమేతమైనదియు, అనేకశాకములతోఁ గూడినదియు, పాలు, నెయ్యి, పంచదార మొదలగు మధురపదార్థములతోఁగూడినదియు, అనేకపిండివంటలతోఁగూడిన ప్రసాదము దేవికి నివేదనచేసి హస్తశుద్ధికొఱకు మలయము మొదలగు ప్రదేశము

బులనుండు మంచిగంధముకలిసిన జలమునిచ్చి సంతుష్టాంతరంగుండై సగుణభావంబుతో దేవిసంబంధమైన మంత్రములను ఆవైశ్యుండు రహస్యముగా జపించెను.

శ్లో॥ దేవీభక్తంగృహేదేత్య లోభయామాసనాదరం। ప్రసన్నా వదదత్రేయం పూజా సంపాదితాకథమ్ ॥ యేనసంపాదితా తుభ్యం దదామివరమద్భుతం । ఇతిశ్రుత్వాధర్మపాలో దేవ్యగ్రేపాంజలిస్థితః॥

తా॥ అనంతరము పార్వతీదేవి దేవాలయంబునుండి వెలువడి వచ్చి భక్తుండైన కోమటిని మనశ్శుద్ధి తెలియగలందులకుఁ బరీక్షించి పిదపఁ ప్రత్యక్షమై ఓయీ, నీవీపూజ నెందుకు జేసితివి, యెంత గొప్పవరంబైన నిచ్చెదనని దేవి పలుకఁగా ఆ వాక్యమును ధర్మపాలుండు విని దోసిలియొగ్గి ఆమెయెదుటనిలుచుండి ఆమెను స్తోత్రము జేసినవాఁడాయెను.

దేవ్యువాచ॥ శ్లో॥ ధర్మపాల త్వయాసమ్యక్ పూజా సంపాదిత నఘ । వరంయాచయమాసక్తి దదామిబహుళంధనమ్ ॥

తా॥ దోషరహితుండైన నాభక్తుండవు నగు ధర్మపాలుండా ! నీవు పూజను జక్కఁగాఁ జేసితివి. వరమునుకోరుము. విశేషధనమిచ్చెదనని దేవి పలికినదాయెను.

ధర్మపాలః॥ శ్లో॥ బహుళాధనసంపత్తి ర్న్యస్తేత్వత్ప్రసాదతః। అపత్యం ప్రాప్తుమిచ్ఛామి పితౄణాంతారకంశుభమ్ ॥

తా॥ ఓ దేవీ ! నీయనుగ్రహమువలన విశేషమైన ధనసంపత్తు నాకు గలిగియేయున్నది. పితృదేవతల ఋణమునుదీర్చి శుభములఁ గలుగఁజేయు సంతానమును బడయఁగోరియున్నాను.

శ్లో॥ అతిథిర్భిక్షుకో గేహే గృహ్ణాతినమదన్నకం । తేనమేబహుళందుఃఖం సభార్యస్యోపజాయతే ॥ ఇతి దీనవచనమబ్రవీత్ ॥

తా॥ అతిథి నాయింటికి భిక్షుకై వచ్చి మేము దంపతులము పెట్టు నన్నమును గ్రహింపఁడాయెను. కాఁబట్టి నాకును నా భార్యకును విశేషమైన దుఃఖముద్భవించియున్నదని దీనుఁడై పలుకుచున్న ధర్మపాలుని మాటలను విని పార్వతీదేవి యిట్లుపలికెను.

దేవ్యువాచ శ్లో॥ ధర్మపాల శృణుష్వత్వం ఉపత్యం నాస్తి సుఖప్రదం। తథాఽపి కిం యాచయసి కన్యాం వైధవ్యదాం తథా॥ పుత్రమల్పాయుషం నాఽథవా దీర్ఘాయుషం చాంధమాత్మజమ్॥

తా॥ ధర్మపాలుఁడా! నీ పూర్వదృష్టిచేతఁగా నీకు సుఖమును గలుగఁజేసెడు సంతానము సంభవింపదు. అయినను విధవయైన కుమార్తెనుగాని, అల్పాయువుగల పుత్రునిగాని, లేక దీర్ఘాయుర్దాయముగలిగి గ్రుడ్డివాఁడగు సుతునిగాని యిచ్చెదఁ గోరుమని దేవి పలికెను

ధర్మపాలః॥ శ్లో॥ పుత్ర మల్పాయుషం దేహి తావతా కృతకృత్యతాం। ప్రాప్స్యామి చోద్ధరిష్యామి పితౄంస్తు మమ ఘోరగాన్॥

తా॥ అల్పాయుర్దాయముగల సుతునొసంగుము. దానం జేసి నేను సాధకజన్ముఁడనై రౌరవాది నరకములయందుండు నా పితృదేవతలను విముక్తులఁజేసి సుగతినిబొందింపగలను.

దేవ్యువాచ॥ శ్లో॥ మత్పార్శ్వే వర్తమానస్య నాభావారుహ్య సంస్థితః। తత్పార్శ్వవర్తిమాతంగస్య గృహీత్వా ఫలమద్భుతమ్॥ పత్న్యై దేయం తతః పుత్రో భవిష్యతి న సంశయః॥

తా॥ దేవి చెప్పుచున్నది:- నా ప్రక్కనుండు విఘ్నేశ్వరుని బొడ్డుప్రదేశం జెక్కి యాతని సమీపమందుండు మామిడిచెట్టునఁగల ఫలములలో నాశ్చర్యకరంబగు నొకపండు తీసికొని వెళ్ళి నిభార్యకు నిచ్చెదవేనిఁ బిమ్మట పుత్రుఁడు కలుగును. సందేహము లేదు.

శ్లో॥ ఇతి దేవీవచశ్శ్రుత్వా గత్వా తత్పార్శ్వ ఏవ చ। నాభిం గజముఖస్యాఽథా ఽఽరుహ్య జగ్రాహ మోహతః॥ ఫలాన్యత్యార్త్యా చ తతః ఫలమేకం దదర్శ సః॥

తా॥ ఈ ప్రకారము ఆదేవి పలుకఁగా విని యావైశ్యుండు వెళ్ళి ఆమ్రసమీపమందుండు వినాయకుని బొడ్డునందెక్కి మామిడి పండ్లయందలి ఆశచే ననేకపండ్లు కోసినను ఒకపండుమాత్రమే దక్కెను.

శ్లో॥ ఏవం పునః పునః కుర్వ్య ఫలమేకం దదర్శహ॥

తా॥ ఈపరికారము మూఁడిమాటికి ననేకములైన పండ్లు కోసిన ను ఒకపండుమాత్రమే తనదగ్గఱనుండెను.

శ్లో॥ క్షుద్భోగణపతిశ్చాపి ధర్మపాలాయశక్తవాన్ । షోడశే వత్సరేప్రాప్తే అహిఃపుత్రంతుదంశయేత్ ॥

తా॥ అనంతరము విఘ్నేశ్వరుఁడు కోపించి నీకుమారునిఁ బదియాఱవసంవత్సరంబునఁ బాముకఱచునని పలికెను.

శ్లో॥ ధర్మపాలఃఫలంసమ్యక్ వస్త్రేబద్ధ్వాగమద్గృహం । ఫలం పత్న్యైదదౌసాఽపి భక్షయిత్వాపతివ్రతా ॥ గర్భంసాధారయామాస పత్యాసహ సుసంగతా । సంప్రాప్తే నవమే మాసే ప్రాసూత సుత ముత్తమమ్ ॥

తా॥ ధర్మపాలుఁడాఫలమును వస్త్రంబునఁగట్టి గృహమునకు వెళ్ళిభార్యకునియ్యఁగాఁ బతివ్రతయైన యాచిన్నది ఆపండునుదిని భర్తృసంయోగమువలన గర్భిణికలదై తొమ్మిదిమాసములు ప్రాప్తియైనపిమ్మట శ్రేష్ఠుండైయిన కుమారునిఁగనెను.

శ్లో॥ జాతకర్మచకారాఽస్య పితా సంతుష్టమానసః । షష్ఠిపూజాంచకారాఽస్య షష్ఠేతుదివసేసతః ॥

తా॥ తండ్రి సంతోషచిత్తుఁడై యాపిల్లవానికి జాతకర్మచేసి యనంతరం బాఱవదినమందు చేయఁదగిన షష్ఠిపూజను జేసెను.

శ్లో॥ ద్వాదశేహనిసంప్రాప్తే శివేతికరణంకృతం। షష్ఠేమాసిచ కారాఽసౌ నన్నప్రాశనముత్తమమ్ ॥

తా॥ పండ్రెండవదినము రాఁగానే యాపిల్లవానికి మంగళప్రదంబయిన శివుఁడనునామంబిడి యాఱవమాసంబున సంతోషకరంబగు నన్నప్రాశనమును జేయించెను.

శ్లో॥ తృతీయేవత్సరేచూడా సప్తమేబ్దేహ్యనుత్తమం। కృత్వోపనయనంపార్థ తతోఽభూత్తుష్టమానసః । దశమేవత్సరేప్రాప్తే ఽబ్యపిద్భార్యాపతివ్రతా ॥

తా॥ మూఁడవసంవత్సరమున చూడాకర్మను, ఏడవసంవత్సరమున మహావైభవముతో నుపనయనముచేసి సంతుష్టాంతరంగుఁడై

గించినియుండెను. పిమ్మటఁ బదియునవసంవత్సరము రాగానే పతివ్రత యైన యాతనిభార్య యిట్లు పలుకుచున్నది.

భార్యోవాచ॥ శ్లో॥ బాలకస్య వివాహోఽపి కర్తవ్యం సుముహూర్తకే॥

తా॥ ఓస్వామీ! మన పిల్లవానికి మంచిముహూర్తము విచారించి వివాహమునుగూడ జేయుమని భార్యపలికెను.

ధర్మపాలః॥ శ్లో॥ మయాసంకల్పితంకాశ్యాగమనంబాలకస్యతత్। కృత్వాసమాయాతుతతో వివాహోఽస్యభవిష్యతి॥

తా॥ ఓ చిన్నదానా! మన పిల్లవాఁడు కాశీ నగరమునకు వెళ్ళి యాత్రచేసి వచ్చిన పిమ్మట వివాహము చేయఁదలఁచితిని అని ధర్మపాలుఁడు చెప్పెను.

శ్లో॥ పుత్రోఽసౌ ప్రేషితస్తేన శ్యాలకేన సమన్వితః। వారాణసీం ప్రస్థితౌతౌ గృహీత్వా బహుళంధనమ్॥ కుర్వంతౌ పథిపద్ధర్మం ప్రతిష్ఠాపురమాయయతుః॥

తా॥ పిమ్మట ఆచిన్నవాఁడును, భావమఱదియుఁగలసి విశేషమైన ధనమునుదీసికొని కాశీపట్టణమునకుఁ బ్రయాణమై వెళ్లుచు మార్గంబున ధర్మముచేయుచు ప్రతిష్ఠానగరమునకు వెళ్ళినవారైరి.

శ్లో॥ క్రీడంత్యఃకన్యకాదృష్టాః తత్రదేశేమనోరమే॥

తా॥ ఆపట్టణంబున నొక రమ్యంబైన ప్రదేశంబున నాడుకొనుచున్న స్త్రీలను జూచినవారైరి.

శ్లో॥ తాసాంసమాజే గౌరాంగీ సుశీలానామ కన్యకా। తయాసహాసఖీకాచి చ్చకారకలహంభృశమ్॥ గాలనంచదదాతస్యై రండభాగ్యేముహుర్ముహుః॥

తా॥ ఆస్త్రీలసమూహములోఁ బచ్చనిశరీరముగల సుశీలయను కన్యకకలదు. ఆసుశీలతో స్నేహముగల యొకానొకస్త్రీ యత్యంతము పోట్లాడి ఓ విధవా! సంపత్తుగలదానా! అని మాటిమాటికి సుశీలను దిట్టెను.

సుశీలా॥ శ్లో॥ సఖిత్వయాగాలనంమే వ్యర్థం దత్తంశుభావనే । జనన్యామేమానవత్యా శ్చాస్తిగౌరీవ్రతంశుభమ్॥ తస్యాప్రసాదాత్సకలాః సంబంధిన్యః ప్రియాః స్త్రియః । అజన్మ విధవా జాతాః కిం పునః కన్యకాత్వహమ్ ॥

తా॥ సుశీల చెప్పుచున్నది:- శుభప్రదంబయిన ముఖముగల యో చెలియా ! నీవు నిష్కారణముగా నన్నుఁదిట్టితివి. మానవతి యను నాతల్లి శుభముల నొసంగు గౌరీదేవిసంబంధమైన వ్రతమును జేయుచున్నది. ఆవ్రతమహిమచే మాబంధువులుగాని, చెలికత్తెలుగాని, ఇష్టమైనవారుగాని సమస్తమైన స్త్రీలును జన్మాంతపర్యంతము విధవలుగానివారై యుందురు. కన్యనయిన నావిషయమై చెప్పనేల.

శ్లో॥ వక్ష్యే తస్యప్రభావం కిం వ్రతరాజస్యభామిని । పూజనే ధూపదీపౌచ యత్రతత్రసుఖంభవేత్ ॥

తా॥ ఓకాంతా! శ్రేష్ఠంబగు నాగౌరీవ్రతముయొక్క మహిమను జెప్పెదను. ఏ గౌరీపూజయందు ధూపమునుగాని, దీపమునుగాని సమర్పించెదరో ఆగౌరీపూజ సమస్తసుఖములనిచ్చును.

శ్లో॥ ఇతిశ్రుత్వా తతోవాక్యం విస్మయోత్ఫుల్లలోచనః । మాతులశ్చింతయామాస బాలకస్యప్రియంతతః ॥

తా॥ ఈప్రకారముగాజెప్పిన సుశీలవాక్యమును విని యాపిల్లవాని మేనమామ ఆశ్చర్యముతోఁగూడిన మనస్సుకలవాఁడై యనంతరం బాపిల్లవానికి శ్రేయస్సు యెట్లుకలుగునోయని విచారించెను.

శ్లో॥ శతంజీవోభవేదేష ఏతద్ధస్తాక్షతాయది । పతంత్యముష్య శిరసి ఇతిభావఃపునఃపునః ॥

తా॥ ఈపిల్లవానికిని, సుశీలకును వివాహమగునేని వివాహకాలంబున యీసుశీలహస్తంబులచే నుంచఁబడిన యక్షతలు యీపిల్లవాని శిరస్సునఁ బడునేని యితఁడు నూఱుసంవత్సరములు జీవించువాఁడగునని మాటిమాటికి మేనమామ తలంచుచుండెను.

శ్లో॥ సుశీలామపిపశ్యన్సః విస్మయోత్ఫుల్లలోచనః । సుశీలా ప్రస్థితాగేహే తదనుప్రస్థితావుభౌ ॥

తా॥ ఆ బాలకుండును సుశీలనుజూచి ఆశ్చర్యముతోఁగూడిన నేత్రంబులుకలవాఁడయ్యెను. పిమ్మట సుశీల యింటికి వెళ్ళుచుండఁగా వారిద్దఱును ఆమె వెంట వెళ్ళిరి.

శ్లో॥ స్వగృహం ప్రాపగారాంసి నిజచిత్తప్రహృష్టయోః । సతతాంకే రమ్యదేశే వాసంచక్రతురాదరాత్ ॥

తా॥ అనంతరం బాచిన్నది తనగృహమునకు వెళ్ళఁగా వారిద్దఱును ఆచిన్నదానిగృహమునకు సమీపముగానుండునట్టియు చెంతనున్న దగ్గరగా నుండు మనోహరంబయిన గృహంబులో ఆసక్తితో నివసించుచుండిరి.

శ్లో॥ వివాహకాలేసంప్రాప్తే సుశీలా జనకోహరిః । సర్వంశివాజ్ఞయాకుర్వన్ శాంతవత్యా స్వకాంతయా ॥ వివాహోద్యోగనాన్ జాతో విచచారోచితంవరం । అసన్నస్థంశివంస్పృష్ట్వా తన్మాతాపితరౌ వృథా। యయాచతుశ్శివాంబద్ధాం జలి వినయసంయుతౌ ॥

తా॥ సుశీలకు వివాహవయస్సు రాగానే తండ్రియగు హరియనువాఁడు తాను జేయునదంతయు పార్వతీదేవి యాజ్ఞానుసారముగా జేయువాఁడై తగినవరుఁ డెక్కడనుండునని తన భార్యతో వివాహ విషయమైన యాలోచనచేసెను. పిమ్మట తల్లిదండ్రులిద్దఱు తమ గృహసమీపమందుండు శివుఁడను బాలునిఁజూచి తగినవాఁడనుకొని గౌరీదేవివద్దకువెళ్ళి అంజలిచేసి వినయముగలవారై తమకుఁ దగిన యల్లుని గలుగ జేయునుని గౌరీదేవిని వేఁడుకొనిరి.

కన్యాపితరౌ ఊచతుః ॥ శ్లో॥ ఉపస్థితో వివాహోఽస్యా పుత్ర్యాః గోఽత్రవరోఽంబికే । ఇతిప్రార్థనవేళాయాం సతతాంకే శివాలయే ॥ పశ్చాద్భాగేనిగూఢోఽభూచ్ఛివాఖ్యవసమాకులః । సుశీలాం భాగినేయస్య ఘటయామీతిచింతయన్ ॥

తా॥ ఓ పార్వతీ! మా కుమారికకు వివాహవయస్సు వచ్చినది, తగినవరుని సంభవింపఁజేయుమని సుశీలయొక్క తల్లిదండ్రులు ప్రార్థించుసమయమంబున ఆశివునియొక్క మేనమామ చెంతనునసమీప

యొక్క తల్లిస్వరూపమును ధరించి పతివ్రతయైన సుశీలనుగూర్చి స్వప్నంబున ప్రియంబగు నొకవాక్యమును పలికెను.

గౌరీ॥ శ్లో॥ సుశీలేతవగౌరాంగి భర్తుర్దంశార్థమాగతః । మహోక్షా భుజంగఉత్తిష్ఠ దుగ్ధంస్థాపయ తత్పురః ॥ ఘటంచస్థాపయాఽశుత్వం తస్మై ధ్యేసంగమిష్యతి । కూర్పాసమంగాన్నిష్కాస్య బంధనీయ స్స్వయాఘటః । ప్రాతరుత్థాయ దేహిత్వం మాత్రే వాయనకంశుభమ్ ॥

తా॥ పచ్చనైన శరీరముగల యోసుశీలా ! నీపెనిమిటిని గఱచుటకొఱకు గొప్పసర్పము వచ్చియున్నది. దానిముందు పాలుపోసిన యొక కుంభమునుంచెదవేని ఆకుంభములోఁ జొరపడును. అప్పుడు నీశరీరమందుండు రవికెనుదీసి యాకుంభమునుగప్పి బంధించి యుదయమునలేచి నీతల్లికి వాయనమిచ్చెదవేని శుభముకలుగును.

శ్లో॥ ఇతిగౌరీవచశ్శ్రుత్వా సుశీలాతత్క్షణముత్థితా। దదర్శాఽగ్రే నిశ్వసంతం కృష్ణసర్పంమహాభయమ్॥ తతశ్చకారగౌర్యుక్తం ప్రవృత్తా నిద్రితుంతతః । ఉవాచవరఆసనోష్ణ క్షుల్లగ్నామహతీనుమ । భక్షణాయాశుదేహిత్వం లడ్డుకాదికముత్తమమ్ ॥

తా॥ ఈప్రకారము గౌరీదేవి చెప్పినమాటలను విని సుశీల తత్క్షణమే లేచి తనముందు బుస్సుకొట్టుచు భయంకరముగనున్న నల్లని సర్పమునుజూచి పిమ్మట గౌరీదేవి చెప్పినట్లు అంతయుఁజేసి యనంతరము నిద్రించుచుండఁగా పెనిమిటి యామె సమీపమునకు వచ్చి నాకు మిక్కిలి ఆకలియగుచున్నది. తినుటకు లడ్డు మొదలగు రుచ్యములగు పదార్థములనిమ్మని సుశీలనడిగెను.

శ్లో॥ శ్రుత్వేతివాక్యం పాత్రేసా దదౌ లడ్డుకముత్తమం । భక్షయిత్వాశివోహైమే తస్మిన్పాత్రేఽంగులీయకమ్ ॥ దత్వాతత్ స్థాపయామాస స్థలేగుప్తే శుభాననః । సుఖేనశయనం చక్రే సుశీలానిద్రితాఽభవత్ । రాత్ర్యామల్పావశిష్టాయా మస్పృష్ట్వైవయయావాశివః॥

తా॥ ఈప్రకారము పెనిమిటి పలికినవాక్యమును సుశీల విని పాత్రయందుంచిన లడ్డుమొదలగు శ్రేష్ఠమయినపదార్థములనియ్యఁగా శోభస్కరమైన ముఖముగల ఆమెపెనిమిటి భక్షించి తన వ్రేలియుం

గరమును అబంగారుపాత్రియందుంచి ఆపాత్రను రహస్యమైన యొక స్థలమందుంచి సుఖముగానిద్రించెను. ఆమెయు నిద్రించెను. పిమ్మట శివుడు తన భార్యను స్పృశింపకయే కొంచెము రాత్రియుండగా లేచి వెళ్ళెను.

శ్లో॥ సూర్యోదయేవినిద్రాఽసౌ లజ్జయామాతురంయయౌ॥

తా॥ సుశీల ప్రాతఃకాలంబున లేచి సిగ్గుగలదై తల్లివద్దకు వెళ్లెను.

శ్లో॥ తతఃపరదినేసాక్షాచ్ఛివఆగాద్వరాత్మనః। అపిచేషాన్వజా నంతి సర్వేత్రాత్రివరాంతరమ్ ॥

తా॥ ఆమరునటిదినంబున భగవంతుడైన శివుడు ఆమె పెని మిటిరూపమునుధరించి రాగా ఆయన సుశీల పెనిమిటికాడని మెన రును మెఱుంగరైరి.

శ్లో॥ తత స్స్నాత్వా సుశీలాసా మాత్రే వాయనకందదౌ। మాతా దదర్శతన్మధ్యే ముక్తాహారమనుత్తమమ్ ॥ దదౌప్రియాయై కన్యాయై సహసాతుష్టమానసా ॥

తా॥ అనంతరము ఆసుశీల స్నానముచేసి ఆకుంభమును తల్లికి వాయనమియ్యగా నామె కుంభము స్పృశించినతోడనే దానియం దుండుసర్పము ముత్యాలసరమై యుండెను అట్టిసరమునుజూచి సం తోషచిత్తముగలదియై ప్రేమాస్పదురాలగుకుమార్తెకు దానినిచ్చెను.

శ్లో॥ క్రీడాకాలేతుసంప్రాప్తే హరఆగాద్వరాత్మనా। ఆదేశయు త్సుశీలాంతాం. క్రీడాస్థంజననీతతః ॥

తా॥ పిమ్మట గ్రీడాకాలము సమీపింపగా అరాత్రి సాంబ మూర్తి ఆమె పెనిమిటిరూపమును ధరించి వచ్చియుండ అనంతరం బామెతల్లి సంభోగముకొరకు వెళ్ళుమని సుశీలనాజ్ఞాపించెను

సుశీలా॥ శ్లో॥ నాహం యాస్యే పరోక్షే మే జననీ యేన పాణిగ్రహః కృతః। అనేననాకిం మనసా క్రీడిష్యే చాప్యతిభాషణమే ॥ ఆరాత్రింతరే సమాసీనో హరఅంతర్హితోఽపిహాసః। ఇతిశ్రుత్వా సమాక్రాంతో చింతాయాస్మితరా తతః ॥ అన్నదానముపాయంతు రచయామ్యాచసుప్రవ్రతం। చక్రతుస్తౌ తదారభ్య పురాణోక్తవిధానతః ॥

తా॥ ఓతల్లీ ! ఈపురుషుఁడు పూర్వము నన్ను వివాహము చేసికొనిన పురుషుఁడుకాఁడు. ఆకారణంబున యీపురుషునితో సంభోగించుట కిష్టములేదని సుశీల తల్లితోఁ జెప్పుచుండఁగా నక్కడ గూర్చుండియుండిన సాంబమూర్తి అదృశ్యుండయ్యెను. అనంతరమీ వృత్తాంతమంతయు తల్లిదండ్రులువిని విచారగ్రస్తులై అన్నదానవ్రత మాచరింపుమని కుమారికతోఁ జెప్పి అదిమొదలు పురాణమందు చెప్పినరీతిగా నావ్రతమును జేయుచుండిరి.

శ్లో॥ సుశీలా పాదయోశ్చక్రే క్షాళనం ముద్రికాన్వితా । జలధారాందదౌమాతా చందనం పుత్రభీష్టదా । హరిర్దీపంచ తాంబూలం బుభుజుస్తత్రమానవాః ॥

తా॥ సుశీల యుంగరమును ధరించినదై బ్రాహ్మణుల పాద ప్రక్షాళనచేయుటయును, కొమార్తె కోఱికను నెఱవేర్చు నుద్దేశ్యము గల తల్లి మంచిగంధంబును ఉదకమును దెచ్చియిచ్చుటయు, తండ్రి యగు హరి నీరాజనము తాంబూలములిచ్చుటయు నేర్పఱచి యీ ప్రకారము అన్నదానవ్రతము జఱుపఁగా మనుష్యులు స్వేచ్ఛగా భుజించుచుండిరి.

శ్లో॥ ఇతి తేషామన్నదానం ప్రవృత్తంభిక్షుసౌఖ్యదమ్ ॥

తా॥ ఈప్రకారముగా వారి యన్నదానము భిక్షుమెత్తుకొను వారికి, బాటసారులకు సౌఖ్యముగలుగజేయునదై ప్రవర్తిల్లుచుండెను.

శ్లో॥ తావుభౌప్రస్థితౌకాశ్యాం ప్రాప్యకాశింసుఖప్రదాం। నిర్మలాంభసిగంగాయాః స్నానంచక్రతూరాదరాత్ ॥

తా॥ అనంతరము శివుఁడును, మేనమామయు నిద్దఱు కాశీ నగరమునకు బయాణమై కొన్నిదినంబులకు కాశీనగరమునకు వెళ్ళి యచ్చట గంగానదియొక్క నిర్మలమయిన జలములో నాసక్తితో స్నానమును జేసిరి.

శ్లో॥ స్వర్గద్వారంప్రస్థితౌతౌ కుర్వంతౌధర్మముత్తమం। పీతాంబరాణిదదతుః భిక్షుకాణాంగృహేగృహే । ఆశీషశ్చదదుస్తస్మై చిరంజీవోభవేదితి ॥

తా॥ అనంతరము వారిద్దఱు స్వర్గద్వారమను పుణ్యస్థలము నకువెళ్ళి యచ్చట గొప్పధర్మములఁ జేయుచు భిక్షులకుఁ బ్రతిగ్రహ మునను బట్టువస్త్రములనిచ్చుచురాఁగా ఆభిక్షుకులు నీవు చిరకాలము జీవింపుమని యాశీర్వచనములు జేసిరి.

శ్లో॥ విశ్వేశ్వరంసమాయాతౌ నత్వాస్తుత్వాపునఃపునః। స్వయం గృహంప్రస్థితౌతౌ శివోమార్గేదుఃతంవదత్ ॥

తా॥ వారిద్దఱు విశ్వేశ్వరుని దర్శనము జేసికొని నమస్కరించి యనేకవిధంబుల స్తుతియించి తిఱిగి తమ గృహమునకు వచ్చుచుం డఁగా మార్గంబున శివుఁడు మేనమామతో శీఘ్రముగా నొక వాక్య మును పలికెను.

శివః॥ శ్లో॥ కాయే కించిదస్వాస్థ్యం మాతుల ప్రతిభాతిహి । తతః ప్రాణోత్క్రమేతస్య యమదూతాఉపస్థితాః॥ మంగళాగౌరికాచాఽపి తేషాంయుద్ధ మభూన్మహత్ । జిత్వాతాఁ మంగళాప్రాణాఁ దదౌ ఆస్యశివస్యచ। శివోఽకస్మాదుస్థితోఽసౌ మాతులం ప్రత్యువాచహ॥

తా॥ ఓ మామా ! నాశరీరమందు కొంచెము బాధగానున్న దని శివుఁడు పలుకుచున్న సమయంబుననే యమదూతలు వచ్చి యా శివునిప్రాణములఁ దీసికొనివెళ్ళుచుండ భక్తులకు శుభములనొసంగు గౌరీదేవివచ్చి ఆయమదూతలతో గొప్పయుద్ధముచేసి వారినిజయించి శివునిప్రాణములఁ దెచ్చి శివునికియ్యఁగా నాతండు హఠాత్తుగా లేచి మేనమామతో నిట్లు పలికెను.

శ్లో॥ స్వప్నేయుద్ధమయాదృష్టం మంగళాయమభృత్యయోః॥ జితామంగళగౌర్యాతే తతోఽహంశయనోత్థితః॥

తా॥ మంగళగౌరీదేవికిని యమభటులకును యుద్ధము జఱిగి నట్లుగాను, గౌరీదేవి యమభటుల నోడించినట్లుగాను నేను స్వప్న మంచుఁ జూచుచుండఁగా నింతలో మెలకువవచ్చుటచే లేచితిని.

మాతులః ॥ శ్లో॥ యజ్ఞానం శివవత్ జ్ఞాతం నస్మర్తవ్యం త్వయా పునః। గచ్ఛామిఅహంత రేచ పితరౌదుఃష్టముత్సుకౌ॥ ప్రస్థితౌతౌతత

స్తస్మాత్ప్రతిష్ఠాపురమాయతుః రమ్యేతటాకేతిత్రైతే పాకారంభం ప్రచక్రతుః ॥

తా॥ అల్లుఁడా ! స్వప్నమందు నీ వేమిచూచితివో దానిని తిఱిగి తలంపకుము. మనము వచ్చి చాలాకాలమైనది. ఇంటికిని నీ తల్లిదండ్రులు మనలఁ జూచుటకు మిక్కిలి యపేక్షతో నుందురు. కాఁబట్టి మనము మన నగరమునకు వెళ్ళుదమని మేనమామ పలుకఁగా ననంతరము వారిద్దఱు ప్రయాణమై వచ్చుచు ప్రతిష్ఠానగరమునకు వెళ్ళి అక్కడ మనోహరమయిన యొక చెఱువువొడ్డున వంటఁజేయుట ప్రారంభించిరి.

శ్లో॥ దృష్టౌతౌ హరిదాసీభిః ధైర్యౌదార్యధరౌశుభౌ ॥

తా॥ అనంతరము హరియింట నుండు దాసీలు చెఱువునకు రాఁగా నక్కడ ధైర్యము త్యాగము మొదలగు గుణములచేఁ బ్రకాశించువారును, శుభముల నొసంగువారునగు వారిద్దఱినిజూచిరి.

శ్లో॥ అన్నదానం హరేర్గేహే ప్రవృత్తం తత్రగమ్యతాం। భో దాస్యోయాత్రికావావాం గచ్ఛావోనక్వచిద్గృహమ్ ॥

తా॥ బాటసారులారా ! ఏల మీరు వంటఁజేసికొని కష్టముం బెంచెదరని యాస్త్రీలుపల్కఁగా మేము యాత్రికులము. కాన ఎవరి యింటికిని వెళ్ళమని వారిద్దఱు ప్రత్యుత్తరమిచ్చిరి.

శ్లో॥ ఇతిశ్రుత్వాతు తద్వాక్యం దాస్యోజగ్ముస్స్వకంగృహం। స్వస్వామినికటేవాక్యం మవదన్సాదరంతదా ॥

తా॥ ఈ ప్రకారము ఆ బాటసారులు పలికిన మాటను విని దాసీలు తమగృహంబునకు వెళ్ళి చెఱువువద్ద జఱిగిన వృత్తాంతమును దమయజమానునికి శ్రద్ధతోఁ జెప్పినవారైరి.

శ్లో॥ సర్వం దాసీవచశ్శ్రుత్వా సహరిః ప్రభురాదరాత్ । ప్రేషయామాసమాన్యాదీ నన్నవస్త్రాణిభూరిశః ॥

తా॥ మా యజమానుండైన హరి యన్నదానము చేయుచున్నాఁడు. అక్కడకు మీరురండని దాసీలుపలకఁగా విన్నవారైరి.

పిమ్మట ఆదరణతో విశేషమైన వస్త్రములను అన్నమును వారికి పంపించినవారైరి.

శ్లో॥ తద్దృష్ట్వావిస్మితౌతావా గచ్ఛాపశ్చ హరేర్గృహం। హరి ర్నాకులమభ్యర్చ్య శివం పూజితుమాగతః ॥ ప్రక్షాళయంతిచసాకన్యా చరణౌతస్యసత్వరా । అభూద్వరోమేఽయమితి జననింప్రత్యువాచహ। హరిఃపప్రచ్ఛసాశ్చర్యం శివంమంగళదర్శనమ్ ॥

తా॥ హరి పంపిన అన్నవస్త్రాదులఁ జూచి వారిద్ద రాశ్చర్య మునుబొంది హరియొక్క గృహంబునకు వెళ్ళఁగా ఆహరి ముందు శివుని సేవనూమనుబూజించి పిమ్మట శివుని బూజించుటకు ప్రారం భింపఁగా ఆసుశీల శివుని పాదప్రక్షాళనముజేసి సంతోషించి సిగ్గుగలదై ఈయనే నాపెనిమిటి యని తల్లితోఁ జెప్పఁగా హరి ఆశ్చర్యముగల వాఁడై మంగళప్రదమైన దర్శనముగల శివునితో నిట్లుపలికెను.

హరిః॥ శ్లో॥ కించిచ్చిహ్నంతవాఽస్త్యత్ర బ్రూహిమేవరదర్శన ॥

తా॥ శ్రేష్ఠమైన రూపముగలవాఁడా! నీసంబంధమైనదేదైనను కొంచెమునను గుర్తు యిక్కడున్నయెడలఁ జెప్పుమని హరి యడిగెను.

శివః॥ శ్లో॥ మమేదం చిహ్నమస్తీహ ఇత్యుక్త్వా గృహమాగతః। తతఆనీయతత్పాత్రం దర్శయామాససాదరమ్ ॥

తా॥ ఇక్కడ నాచిహ్న మున్నదని శివుఁడు పలికి గృహము లోపలికి వెళ్ళి తాను పూర్వము దాచియుంచిన పాత్రను దెచ్చి శ్రద్ధతోఁ జూపించెను.

శ్లో॥ తత్పాత్రంచ హరిర్దృష్ట్వా గర్భాదానంచకారసః। దదౌ రత్నానివస్త్రాణి సువర్ణానిబహూన్యపి ॥

తా॥ ఆపాత్రను హరి చూచి సంతసించి గర్భాదానముచేసి అనేకమయిన రత్నములను, వస్త్రములను, బంగారములను కానుకగా నిచ్చెను.

శ్లో॥ తావూదాయపరిస్థితేతౌ దదంతౌ బహుళంధనం। శ్రావణే మాసి సంప్రాప్తే వ్రతం భామేచకారసా। భుక్త్వా సర్వే ప్రస్థితాస్తే యోజనంజగ్ముసత్తమాః ॥

తా॥ వారిద్దరు హరియిచ్చిన ధనమును దీసికొని విశేష ధనమును ధర్మముచేసిరి. పిమ్మట శ్రావణమాసమురాఁగా మంగళవారంబున ఆసుశీల వ్రతమును జేయుచుండఁగా నందఱు నచ్చట భుజించి మహానుభావులగు వారందఱొక యామడదూరమువఱకుఁగూడవచ్చిరి.

సుశీలా॥ శ్లో॥ గౌరీవిసర్జనం చాఽహం కరోమ్యద్యైవ సాదరం। శ్వశ్రూశ్వశురయోరద్య దర్శనేఽస్తికుతూహలమ్ ॥

తా॥ గౌరీదేవిని విసర్జనచేసినదై వెంటనే మామను అత్తను జూచుటకు సంతోషము పుట్టుచున్నదని సుశీల చెప్పెను.

శ్లో॥ తతో గంతవ్యమస్మాభిః పితరౌ ద్రష్టుమాదరాత్ । ఇత్యుక్త్వా తేగతేమార్గే గౌర్యా ఆవాహనంకృతమ్ ॥ దదృశుస్తత్ర సౌవర్ణ దేవాలయమనుత్తమమ్ ॥

తా॥ పిమ్మట వారిద్దఱును గృహమందుండు శివుని తల్లిదండ్రులఁజూడ నాసక్తిగలవారై ప్రయాణమై వెళ్లుచుండఁగా మార్గమధ్యంబున గౌరీదేవిని ఆవాహనజేసి పూజించగా నచ్చట శ్రేష్ఠమైన సువర్ణదేవాలయ మగుపడెను.

శ్లో॥ గౌరీ సమర్చనం దీప దానంచాచవ్యచీకరత్ । తతస్సశ్వే ప్రస్థితాస్తే పితరౌద్రష్టుముత్సుకాః ॥

తా॥ పిమ్మట ఆసుశీల గౌరీదేవిని పూజించినదై దీపదానము మొదలగువానిని క్రమముగా జేసెను. పిమ్మట బంధువులందఱు శివుని తల్లిదండ్రులఁజూచుటకు వేడుకగలవారై ప్రయాణమైరి.

శ్లో॥ కుండినాసన్న దేశేతాన్ దృష్ట్వావిస్మయినోజనాః । అబ్రువన్తేధర్మపాలం సోత్కంఠంప్రియదర్శనాః ॥

తా॥ కుండినమను పట్టణ సమీపమునకు వచ్చియున్న శివుని మొదలగువారినిఁజూచి జనులాశ్చర్యపడుచు ప్రీతికరమైన లక్షణములు గలవారై ధర్మపాలునితో సంతోషపూర్వకముగా నిట్లు పలికిరి.

జనాః॥ శ్లో॥ ధర్మపాలాఽద్యతే పుత్ర స్సభార్యా శ్యాలకస్తథా। సమాయాతోవయందృష్ట్వా అధునైవసమాగతాః ॥

తా॥ ఓ ధర్మపాలుఁడా ! నీ కుమారుఁడు భార్యాసమేతుఁడై నీభావమఱందితోడ వచ్చియున్నారు. మేముచూచి నీతోఁ జెప్పుట కిప్పుడే వచ్చితిమి అని జనులువచ్చి చెప్పినవారైరి.

శ్లో॥ యావజ్జనావదం స్తత్ర తావత్సోపిసమాగతః । నమస్కారాం చకారాఽసౌ పితృభ్యాం పితృవల్లభః ॥ మాతులోఽపి నతిం చక్రే భగినీ ధర్మపాలయోః । సుశీలా శ్వశురాయాఽపి శ్వశ్రూం త్వాస్థితా తదా ॥

తా॥ జనులుచెప్పిన తక్షణమే ధర్మపాలుఁడు వెళ్ళఁగా తల్లిదండ్రులయందుఁ బ్రేమగల కుమారుఁడయిన యాశివుఁడు తల్లిదండ్రులకు నమస్కరించెను. మేనమామయుఁ దన తోఁబుట్టువునకు బావకు నమస్కారముఁ జేసెను. సుశీలయు ఆరీతిని అత్తకును మామకును నమస్కారముఁ జేసినదాయెను.

శ్వశ్రూః॥ శ్లో॥ సుశీలేతిద్వ్రతంబ్రూహి యద్వ్రతస్యప్రభావతః । ఆయుర్వృద్ధిశ్శిశోర్మేఽపి జాతాకమలలోచనే ॥

తా॥ ఓ సుశీలా ! పద్మములవంటి నేత్రములు గలదానా ! నా కుమారునికి ఆయుర్వృద్ధి యేవ్రతమహిమచే నయ్యెనో ఆవ్రత ప్రభావమును జెప్పుమని అత్త సుశీలనడిగెను.

సుశీలా॥ శ్లో॥ నజానేహం వ్రతంశ్వశ్రూ జ్ఞానేమానవతీంహరిం । శ్వశురంధర్మపాలంచ శ్వశ్రూంచభవతీంతథా ॥ మంగళాం దేవతాం జానే వరంతుయునయోస్సుతం। ఇత్యుక్త్వాచసుశీలాసా వవందేస్వాం తహర్షితా । భుక్త్వాభోగాన్యథాపశ్చాత్ కైలాసంచ సభర్తృకా॥

తా॥ ఓఅత్తా ! ఆవ్రతమెటువంటిదో నేనెఱుఁగను. నాతల్లియగు మానవతిని, తండ్రియగు హరిని, మామయగు ధర్మపాలుని, అత్తయగు మిమ్మును, మంగళప్రదురాలగు గౌరీదేవిని, మీకుమారుఁడగు నాపెనిమిటినిమాత్ర మెఱుఁగుదునని సుశీల సంతోషముతో జెప్పినదాయెను. పిమ్మట స్వస్థిచిత్తముగలదై వారికి నమస్కారములుజేసి పిమ్మట ననేకభోగముల ననుభవించి జన్మాంతంబునఁ బెనిమిటితోఁగూడ కైలాసమునకు జనెను.

కృష్ణః॥ శ్లో॥ శ్రావణేమాసి భౌమేషు చతుర్షు వ్రతమాచరేత్ । ప్రాతరుత్థాయ సంస్నాతా సంకల్ప్య వ్రతముత్తమమ్ ॥ ఉపచారైః షోడశభిః పూజయేన్మంగళాంతథా । తద్రాజనంతతఃకుర్యాద్దీపైః షోడశ సంఖ్యయా । మాత్రే సువాసినీభ్యశ్చ దేయంవాయనముత్తమమ్ ॥

తా॥ కృష్ణమూర్తి చెప్పుచున్నాడు:- శ్రావణ మాసంబున నాలుగు మంగళవారంబులయందు ప్రాతఃకాలంబున లేచి చక్కగా స్నానముచేసి శ్రేష్ఠంబగు గౌరీవ్రతమును జేయుటకు సంకల్పించి షోడశోపచారంబుల గౌరీదేవినిఁబూజించి కర్పూరహారతి నిచ్చి పదియారు జ్యోతులతోఁగూడిన వాయనమును తల్లికిని ఇతర సువాసినీ స్త్రీలకును వాయనమివ్వవలయును.

శ్లో॥ భోక్తవ్యా దీపకశ్చాఽపి అన్నం లవణవర్జితం । విసర్జనం మంగళాయా దీపదానం తతఃక్రమాత్ । పంచసంవత్సరే ష్వేవం కర్తవ్యంపతిమిచ్ఛుభిః ॥

తా॥ జ్యోతుల సహితముగా ఆ పిష్టములను ఉప్పు లేకుండ అన్నముమాత్రము భుజించి దీపదానముచేసి పిమ్మట విసర్జన చేయవలయును. పెనిమిటికి దీర్ఘాయుస్సునుగోరు స్త్రీలు యీప్రకారముగా నైదుసంవత్సరములు క్రమముగా గౌరీవ్రతమును జేయవలయును.

అథ ఉద్యాపన ముచ్యతే॥ శ్లో॥ పంచమేవత్సరే ప్రాప్తే కుర్యాదుద్యాపనంవ్రతమ్ ॥

తా॥ అయిదవ సంవత్సరమున నుత్తమమయిన యీవ్రతోద్యాపనమును జేయవలయును.

శ్లో॥ శ్రావణేమాసిభౌమేతు స్వాచార్యం వరయేద్వ్రతీ । దివా వ్రతం ప్రకుర్వీత కలశస్థాపనం నిశి ॥ మంటపేలింగతోభద్రే పీఠేదేవీం ప్రపూజయేత్ ॥

తా॥ శ్రావణమాసంబున మంగళవారదినంబున వ్రతమును జేయు స్త్రీ ఆచార్యునిఁ ప్రార్థించి పగలు వ్రతమును జేయవలెంచి పూర్వదిన రాత్రియందు శుభప్రదంబయిన పీఠంబున మంటపంబేర్ప

అచి దానియందుఁ గలశమునుంచి యాకలశమునందు గౌరిదేవి నావాహనముచేసి పూజింపవయును.

శ్లో॥ ఉమామహేశ్వరీంమూర్తిం కలశేనిక్షిపేత్తతః। బ్రహ్మణః కలశంచైకం గణేశస్కందయోర్ద్వయమ్॥ శచీపురందరం త్వేకం మాతౄణాంస ప్తకంతథా । లక్ష్మీనారాయణ స్యైకం సావిత్రీకలసంపరం । ఏకంసమస్తదేవానాం గ్రహాణామేకముచ్యతే ॥

తా॥ పిమ్మట ఉమామహేశ్వరులకు ఒక కలశమును, బ్రహ్మకు ఒకకలశమును, విఘ్నేశ్వరునికి నొకకలశమును, కుమారస్వామికి నొక కలశమును, శచీంద్రులకు నొకకలశమును, చాముండాది సప్తమాతృలకు నేఁడు కలశంబులను, లక్ష్మీ నారాయణులకు నొకకలశమును, సావిత్రీదేవికి శ్రేష్ఠంబగు నొకకలశమును, ఇతరమయిన సమస్తదేవతలకు నొకకలశమును, సమస్త గ్రహంబులకు నొకకలశమును నుంచవలయును.

శ్లో॥ అశక్తౌకలశాఃపంచ తదశక్తౌద్వయంతథా। ప్రధానదేవతాత్వత్ర మంగళాపతిసంయుతా॥

తా॥ పూర్వమందుఁజెప్పిన కలశములను సంపాదింపలేనివారు అయిదు కలశముల నుంచవలయును. అయిదింటిని తెచ్చుకొనలేనివారు రెండుకలశములనైన నుంచవలయును. ఇక్కడ ప్రధానదేవత పతివిశిష్టమయిన మంగళగౌరీదేవతయని చెప్పఁబడినది.

శ్లో॥ కలశస్థాపనంపూజా యామేయామేతుజాగరం । ప్రభాతే హావనంచైవ తత్తన్మంత్రైస్స్వశాఖయా॥ గుడేనజీరకేనాఽపి పరమాన్నేన చాఽజ్యతః । అశ్వత్థస్య సమిద్భిశ్చ దూర్వాభిశ్చాఽత్రహావయేత్ । సర్వమంగళమాంగళ్యే మంత్రసమప్రధానతః ॥

తా॥ విధిగా కలశస్థాపనచేసి ప్రతియామమునఁ బూజచేయుచు రాత్రియంతయు జాగరణముచేసి ప్రాతఃకాలంబున నారివారిశాఖకుఁ జెప్పఁబడిన మంత్రంబులతో బెల్లముచేతను, జీలకఱ్ఱచేతను, పరమాన్నముచేతను, ఆజ్యముచేతను, రావిసమిత్తులచేతను, గరికలచేతను

హోమము: జేయవలయును. ఇక్కడ "సర్వమంగళమాంగళ్యే" అనునది ప్రధానమంత్రము.

శ్లో॥ వాయనాని ప్రదద్యాచ్చ వేణుపాత్రేషు షోడశ । ఉద్దీప్యస్వేతిమంత్రేణ జ్వాలాంపూజ్య ప్రదాపయేత్ ॥

తా॥ పిమ్మట వెదురుపాత్రలయందు పదియాఱు వాయనములను వుంచి "ఉద్దీప్యస్వ" అను మంత్రముచే జ్యోతుల వెలిగించి వాయనమంత్రవిధిచే నివ్వవలయును.

శ్లో॥ సువాసిన్యశ్చసంపూజ్య స్తతోదంపతిపూజనం । ప్రదద్యాన్మంగళద్రవ్యం సువాసిన్యైవిశేషతః । గాందద్యాదపితాన్ సర్వాన్భోజయేదేవసంగ్రహః ॥

తా॥ పిమ్మట సువాసినీ స్త్రీలను బూజింపవలయును దంపతీ పూజ చేయవలయును. సువాసినీ స్త్రీలకు విశేషముగాఁ గుంకమును పసుపు మొదలగు శుభప్రదంబులగు ద్రవ్యము లియ్యవలయును. గోదానములను జేసి వారినందఱిని భుజింపఁజేయవలయును. ఇట్లుద్యాపనము సంక్షేపముగాఁ జెప్పఁబడినది.

శ్లో॥ యఇదం శృణుయాన్నిత్యం శ్రావయేద్వా సమాహితః । సర్వపాపవినిర్ముక్తో సయాతిపరమాంగతిమ్ ॥

తా॥ ఈకథను మనసు విందురో స్వస్థచిత్తముగలవారై యితరులకు వినుపించుదురో వారందఱు పాపములనుండి విముక్తంబడి వైకుంఠమును బొందుదురు.

ఇతి భవిష్యోత్తరపురాణే మంగళగౌరీ వ్రతోద్యాపన ప్రకరణం సమాప్తమ్.

# శ్రావణ మంగళ వారము పాట.



ఈశ్వరపుత్రునకు గజావతారునకు పార్వతీతనయునకు భక్తి తోనూ । వాక్కుసుద్ధీనిచ్చు నైభోగరాయునకు శారదాంబకు నేను సన్నుతింతూ ॥ జయమంగళా । నిత్యశుభమంగళా ॥ మంగళగౌరీ కథా మహిమీద వెలసినా పాటగావించెదా భక్తితోనూ। మహిమీద ఒకరాజు సంతానములేక సౌభాగ్యపదవి తా నేలుచుండె ॥జ॥ పరమేశ్వరుడుతన యాత్మలో హరిషించి ఇహపరాదుల వారికి త్తమనుచు । లింగంబు తానొక్క జంగమావతారమై గురుధర్మ ఘోరాండమనుచు వచ్చె ॥జ॥ మేడమీదనుంచి దిగివచ్చి యాసతీ బంగారుపళ్ళెముతో నాణెముగనూ । నడచిరాగాజూచి పరమేశ్వరుడు తాను నిమిషంబు నిలువకాపోయెనప్పుడూ ॥జ॥ ఇదియేమిచోద్యమో యెఱుగంగవలెననీ మఱుదినమునాటికీ ముందుగానూ । మరుగుచాటునయప్పుడు కాచికొని యుండగా గంటలుమోగించుచూ వచ్చెశివుడూ ॥జ॥ వచ్చినజంగాన్ని పోనీక పట్టుకొని యిదియేమికారణము అనియడిగెనూ । పుత్రపౌత్రులు లేరు మీచేతిభిక్షంబు హరహరఅంటరాదనిబల్కెనూ ॥జ॥ మాకేగతి యనుచు సతిపతులిద్దరు సాష్టాంగ మొనగిరి శివునకపుడూ । పరమేశ్వరునిగూర్చి తపస్సుచేయుమని ఆనతిచ్చిపోయె ఆజంగము ॥జ॥ సతీపతులిద్దరు రాజ్యములువిడచి పరమేశ్వరునిగూర్చి తపస్సుచేయ । వారి భక్తికిమెచ్చి పరమేశ్వరుండపుడు ప్రత్యక్షమయ్యెను రాజుకపుడూ॥జ॥ ఇచ్చితిని ఒకవరము మెచ్చితినినిపామ్మనుచు స్త్రీజన్మమా పురుషజన్మమానగా। ధర్మపతియైనట్టి పుణ్యవతినిత్తునా పదహారుసంవత్సరములసుతునిత్తునా ॥జ॥ సతిపతులిద్దరు సమకూర్చుకొనివారు పరమేశ్వరునితో వధోపించియు । ధర్మవతినిజూచి తాళలేముమేము పుణ్యమేమోగాని పుత్రునీ నేనూ ॥జ॥ ఊరికీముందరా కాళికాగుడివెనుక చూతవృక్షమునందు ఫలమున్నదీ । ఆఫలము తెచ్చుకొని భుజియింపుమనిపలికి అంతర్ధానమయ్యె నాదేవుడూ ॥జ॥ ఆరాజు హర్షమున ఆవృక్షమెక్కియు ఆఫలము లన్నియు కోసితెచ్చి । పణతిముందరపెట్టి విప్పిచూడగానే వక్కటేఫలమయి నొప్పుచుండే ॥జ॥ ఈశ్వరుండిచ్చిన ఫలముప్రాప్తి

యింతే అధికఫల మొచ్చునా యతివమనకూ। అనుచు భుజియించగా అతివ గర్భమునిలచి నవమాసములునిండె నాతికప్పుడూ ॥జ॥ సూర్య తేజంబులతో వొప్పేటి సుతునికి పుత్రోత్సవము జేసె బుణ్యాశాలి। సంతోషమునరాజు నామకరణంబు వ్రాసె నారాయణాయని నామమిడిరీ ॥జ॥ రాజకుమారునకు రమణులందరు గూడి వుగ్గులమరా బెట్టి రోష్టం మీరా। దృష్టితాకకుండ చుక్కబొట్టూ పెట్టి శిరసంటి తొట్టిలోనుంచి రప్పుడూ ॥జ॥ బాల్యప్రాయమునాడు బాలతోడుగులుతోడిగి ఆటపాత్రి యంబునా ఆటజూచి। నాటపెంచిననాని నూటపెంచీనట్టు కాశీయాత్రకు శాల ధనముకట్టి ॥జ॥ కాశికిబోదామంచు ఘనముతో యిద్దరూ కాశిపట్నానికేవచ్చిరీ। ఆవనానికిపోకతిచాల బడలికగాని పరమేశ్వ రాజ్ఞచే నిలచిరప్పుడూ ॥జ॥ శ్రావణమాసాన మంగళగౌరునూ పూజింతురూ। అంగనలు తామరపూలు కోయ్యారాగా రాచకూతురు వచ్చె రమణి వెంట ॥జ॥ పుణ్యాంగనలెల్ల పువ్వులుకోసుక రాగా సందడి పడిరాజునడమానిలచె। సత్యవతీకన్న మాంగల్యవతియని చెరుగుముడి వేస్తికొని శీఘ్రముగనూ ॥జ॥ ఆరాత్రినగరులో ఆవధూవరులునిలచి తోటలో నూడగనూ। అక్కడికి చనుదెంచి తన్నంత నిమిషమున తోడ్కొనిపోయి మధుపర్కమిడిరీ ॥జ॥ రాజధువు శాస్త్రాలు అన్ని యునుగ్రావించి రాజపహోమమువేల్చె రమణితోనూ। అగ్నిసాక్షిగ పెండ్లి ఆడినాసతిగూడి సప్తఋషులకు మొ్రిక్క సంభ్రమముగా ॥జ॥ వధువరులుయిద్దఱికి వొప్పుబువ్వంబులు చేయించిరచోట శీఘ్రముగనూ। రాపులందరు తాము రమ్యముగ భుజియించి కరములూ కడుకొని గద్దెనుండే ॥జ॥ చిత్తరువు వ్రాసినా చవికెలోపలనుంచి పట్టిమంచమువాల్చి పరుపుపఱచి। కస్తూరిపునుగు జవ్వాజి మొదలుగ దెచ్చి వొప్పుతో కలిసిరి వధువరులకూ ॥జ॥ గిన్నెలో పాలు చక్కెర తేనెయు ఘృతములు ఆరగించగ బెట్టిరీ। కర్పూరభాగాలు పచ్చనిచెంబుతో పన్నీరు తెప్పించి వుంచిరప్పుడూ ॥జ॥ దంపతులిద్దఱు యింపుతో భుజియించి సంతోషముగను తాంబూల మొసగి। సతితోడమీాద పాద మూని యాగిన్నె భక్తితో వుంచెనూ గుప్తగానూ ॥జ॥ తూగూ

బుద్యాలపై దంపతులిద్దరూ శయనించి నిద్రలు సేయుగానే । కాల
మృత్యువుపచ్చి కాలసర్పంబయి బాలకునిగరువంగవొచ్చెనప్పుడూ ||జ||
మంగళగౌరీ మనువస్వప్నమందు నీసతికినీడంగసమయమిాది । మాం
గల్యవతి నిద్ర శీఘ్రముగ మేల్కొని కనులు మగువదెరచి చెలియా
చూచు ||జ|| సుమాంగల్యవతినిద్ర శీఘ్రముగమేలుకొని కన్నులూ
తెరచి కలియచూచి । కృష్ణసర్పముమాని కిలకిలనవ్వుచు స్వర్ణకల
శము తెచ్చియుంచి ||జ|| బాలభక్తికిమెచ్చి నాగేంద్రుడప్పుడు కలశం
బులోప్రవేశించెనప్పుడూ । చుట్టుచుట్లును అతను పవళించియుండ ప్ర
దక్షిణంబొజేసి మొక్కినిలచె ||జ|| ముత్యాలుగూర్చిన రవికె తాను
విడచి వ్రాసినాకట్టుకొని మొదటనిలచె । పతిప్రాణమెత్తుకొని పంక
జాక్షి తాను తిరిగి శయనించి కడునిద్రపోయి ||జ|| అరుణోదయానవేళ
ఆరాజు మేలుకొని నేటిగండము మనకు గడచెనిప్పుడూ । యెవ్వరికి
చెప్పకా యుద్దరూతగి కాశీకిచేరరి శీఘ్రముగనూ ||జ|| తెల్లవారం
గానె యెల్లప్రజలూలేచి పన్నీరుచిల్కి ముగ్గులుపెట్టి । రత్నాలు
గద్దెలు రమణులువుంచిరి వధువరులువచ్చి నిల్చిరప్పుడు ||జ|| పెళ్ళికూ
తుర్ని పేసి శృంగారములుజేసి రత్నాలగద్దెపయి వుంచగానె । తప్పక
వధువరుని ముఖము తానుజూచి తనపతికాడనీ తలచెనప్పుడూ ||జ||
లేచి పేకమిాదకూర్చుండిచి తించి జాణలై నట్టిసఖియలెల్ల । నేర్పుతో
నీపతి అవునీయండరూ తెలపోసితెలిపిరా సఖియలెల్ల ||జ|| సత్యసతి
చూడకన్న తనతండ్రినీబిలచి నామాటవినియు సన్నాదరించు । నీవు
సత్రిమునేడు నిజముతో నిలిపితె భక్తితో యుంమాలముత్తు నేను||జ||
కాశిచేరియువారు గంగాస్నానముచేసి కాలభైరవుల దర్శనముజేసిరీ ।
అన్నపూర్ణనుచాల అతిభక్తివేడుకొని విశ్వేశ్వరుని గుడి దర్శించిరీ ||జ||
మణికర్ణికాదేవి తిరువేణిదర్శించి బిందుమాధవ దర్శనముచేసిరీ। భాగీ
రథినిచాల భక్తితో వేడుకొని తిరిగివచ్చెనువారు కాశికప్పుడూ || జ ||
కాశిచేరిరివారు గంగస్నానముచేత కాశిపట్నానికే వచ్చిరప్పుడు మహా
రాజుపాత్రాన మామ అల్లుళ్ళు తమరు గంగాదించి నిరచిరప్పుడు||జ||
వచ్చినవారిని భుజియింపుడంటేను వొల్లమని వారితో పలికిరప్పుడు ।

స్వయంపాకమందుకొని యందరూభుజియించి నిలచిరీ నిమ్మాలమేడ లోన ॥జ॥ కర్పూరభాగాలు కాంతతానిచ్చె అక్కడికివేంచేసె అందు నుండి। కాశీవాసులకేల కర్పూరభాగాలు వల్లమని వారితో పలికి రప్పుడు ॥జ॥ పరదేశిపరదేశి రాజులు విప్రులు భుజియించి తాంబూల మందుకొనిరాగ। నిదానేలవల్లరని పరిచారకులుపోయి తోడుకుపోయి రాజసముఖమునకు ॥జ॥ రాజసముఖమున రమణితాగూర్చుండి నాధు మిదానచ్చేటిరాకజూచి। తానుమనంబున చాలసంతోషించి తాంబూల మిచ్చి తాకరముబట్టె ॥జ॥ తాంబూలమూ యిచ్చి కరముతానూబట్టి ఆనందభాష్పముల కురిపించెనూ। ధన్యురాలనైతి దరిజేరితిని నేను రాజుకు ముద్దుకూతురనైతిసీ ॥జ॥ ఇదియేమిచోద్యమో వెరగుపడి చూచుచు ఆశ్చర్యపడి రాజు అనగగానే। నికు గుర్తులుగలవు నీల వర్ణవృనివు సత్యముగదెల్పుమో వృత్తాంతమూ ॥జ॥ కాశికిబోదా మనుచు కాంక్షతోనిద్దరము నిలచితోటాలోనె వుండగాను. అక్కడికి వేంచేసి సన్నికవిమిషమున మధుపర్కమిచ్చి కల్యాణమండె ॥జయ॥ పణతినాతోడమీద పాదంబు యాగిన్నె హత్తుగానిలిపెను సువర్ణకల శంబుదెచ్చి। దేదీప్యమానమై వెల్గుచుండెను బుజ్జగింపుచుతాకీ మెడ కంఠమాలవేసె ॥జ॥ ఆకాశమంతాను పందిళ్లుగావేసి భూమియంతయు ఆరుగువేసి। తోరణములుగట్టి నగరు శృంగారించి కల్యాణవేదికగా జేరిరి ॥జ॥ గోదానముడిసి భూదానముజేసి సువర్ణదానముచేసె సొంపు తోను। అశ్వదానముచేసి గజదానముచేసి కన్యదానముచేసె ఘనము గాను ॥జ॥ ఆరాత్రినగరిలో కన్యవధువరులు తల్లిదండ్రాదులను తలచు కొనుచు। అనిబుజ్జగింపుచు మామతోఅల్లుడు శీఘ్రముగ సీమకువెళ్ళ జలెను ॥జ॥ ముద్దుకూతురుకిచ్చె ముత్యాలపల్లకి పచ్చలపల్లకీ భాగీరథి కిని। కోటివేలుచేయు ఉత్తమాశ్వమునిచ్చి అల్లునీకూతురుని అంపిం చెను ॥జ॥ తెలిసినఫలమెల్ల గ్రక్కునవెడలెను భక్తితోగూడ బాలు డును। గంగను ముందరనుంచుకొని తమ సీమచేరి తనక్షేమములు చెప్పంపెనూ జ॥ తనతోటిజనమెల్ల తక్షణంబెడలగా భక్తిగా బాలు డొచ్చెననుచూ। పుత్రుడని చెప్పగా నుత్సాహమును॥ బొంది ఆలింగ

నముజేసి అతివతోనూ ॥జ॥ ఏమినోమునోచి తేవ్రతముజేసితి పుత్ర
భిక్షంబెట్టె పుణ్యాశాలి। సత్యముదప్పకా మాంగల్యములుకదా మం
గళగౌరునూ పూజించిరి ॥జ॥ భాగీరథీచాల భక్తితోపూజిస్తిమీనంటి
అత్తనూమలుగలుగునా। యెక్కువరాజ్యము మిక్కిలిసంపదా తరగని
అయిదు సాధకసౌఖ్యములూ ॥జ॥ ఎప్పుడుపూజిస్తి మాంగల్యములు
గలవు మంగళగౌరునూబూజిస్తిని। ఈకథను పాడినవారికి విన్నవారికి
నయినవిభవంబులూ। ఇష్టసంపదలిచ్చు యీరాజపదవిచ్చు సత్పుత్రుల
బిచ్చుసర్వేశురాణి॥ జయమంగళా నిత్యశుభమంగళా ॥

శ్రావణమంగళవారముపాట సంపూర్ణము.



# శ్రావణశుక్రవారముపాట.

కైలాసగిరిలోను కల్పవృక్షముక్రింద ప్రమథాది గణములూ
కొలువగాను। పార్వతీపరమేశ్వర్లు బాగుగా కూర్చుండి పరమేశ్వరుని
యడిగె పార్వతపుడు॥ జయమంగళా నిత్యశుభమంగళా॥ ఏవ్రతము
సంపదలు మెలమితోడుత నిచ్చు యేవ్రతము పుత్రపౌత్రాభివృద్ధి
నొసంగు। అనుచునూ పార్వతి యూహరునడిగెను॥ కుండినీలని యేటి
పట్నంబులోపలా చారుమతిఅనియేటి చేడెగలదు। అత్తమామలసేవ
అతిభక్తితోజేసి పతిభక్తిగలిగుండుభాగ్యశాలీ ॥జ॥ వనితస్వప్నమందు
వరలక్ష్మితాజోయి చారుమతితాలెమ్మని చేతజరచెను। చరిచినప్పుడు
లేచి తల్లి మీరెవ్వరని సమస్కరించిపలికె నలినాక్షిరో॥జ॥ వరలక్ష్మినే
నేను వరములు యిచ్చేను మేల్కొనవె చారుమతి గొబ్బనాను।
కొలిచెనప్పుడు మెచ్చి కోటిసరాజ్యముల్ వరమప్పుడిచ్చేటి వరలక్ష్మిని
॥జ॥ ఏవిభునిపూజ చేయవలెననుచూను చారుమతియడిగెను శ్రావ్య
ముగదూ। ఏమాసంబున యేపక్షంబు యేవారమునాడు యేప్రొద్దున
॥జ॥ శ్రావణమాసాన శుక్లపక్షమునందు శుక్రవారమునాడు ముసి
మాపునా। పంచకల్పాలు తెచ్చి బాగుగా తనుసిల్పి సువర్ణంతేమున

శోభితముగ ॥జ॥ చారుమతిలేచి యా శయ్యపై కూర్చుండి బంధువుల పిలిపించి బాగుగాను। స్వప్నమున శ్రీమహాలక్ష్మి చకచకవచ్చి కొలు మనిపల్కెను కాంతలారా ॥జ॥ ఏవిధంబున పూజ సేయవలె నన్నదో బంధువులు అడిగిరి ప్రేమతోను। యేమాసంబున యేపక్షంబున యే వారమునాడు యేప్రొద్దునా ॥జ॥ శ్రావణమాసాన శుక్లపక్షమునందు శుక్రవారమునాడు మునిమాపునా। పంచకల్యాలుదెచ్చి బాగుగా తను నిల్పి భక్తితో పూజించుమనిచెప్పెనూ ॥జ॥ అపుడు శ్రావణమాసము ముందుగావచ్చెనని భక్తితోపట్నము నలంకరించె। పన్నెతోరణాలు సన్నపూజాజలూ చెన్నుగా నగరు శృంగారించుతురు ॥ జ ॥ వరలక్ష్మి నోమనుచు వనితలు అందరూ పసుపుతోడి పట్టుపుట్టములుగట్టి। పూర్ణంపు కుడుములు పాయసాన్నములు అవశ్యముగ నైవేద్యములువెతుదురూ ॥ జ ॥ కంద్రిమండిగలు నుండిగలుదండిగ వెంచి యొండిన కుడుములు ఘనవడలునూ। దండిగావల్యాల ఖర్జూరఫలములూ విధిగా నైవేద్యములు ॥జ॥ నిండుబిందెలలోను నిర్మలపుదకము పుండరీకాక్షులకు వారుపోసీ తొమ్మదిపోగుల తోరమొప్పగపోసి తల్లికీ కడుసంభ్రమమున ॥జ॥ వేదవిదుడైనట్టి విప్రుని పిలిపించిగంధ మక్షతలిచ్చి కాళ్ళుగడిగీ। తొమ్మిది పిండివంటలతోరమొప్పగబెట్టి బ్రాహ్మణునకు పాయసంబెట్టి ॥ జయమంగళా నిత్యశుభమంగళా ॥

శ్రావణశుక్రవారపు వరలక్ష్మీవ్రతపాట సంపూర్ణము





# ప్రకటన.

—***—

నావద్ద స్మార్త జ్యోతిష, ధర్మశాస్త్ర, పురాణగ్రంథములు, వ్రతకల్పములు, మొదలగునవి అమ్మబడును.

రేట్లు సరసము:- కేట్లాగు వుచితము.

వలయువారు:-

శ్రీ లక్ష్మీనరసింహ ముద్రాక్షరశాల,
బచ్చుపేట, మచిలీపట్టణము. 18/25.